సరసిజభవుఁడు మీ చరణపంకజముల
గుఱిగొని భజియింప గోరియున్నాఁడు ॥ 2 ॥

భోసల కులసింధు పూర్ణచంద్రుండయిన
శ్రీ శాహభూపాల శేఖరుఁడు వాసిగా
మీమీద వరుసతో కవితలుచేసి
వినిపింపగా నీకు వేచియున్నాఁడు మేలుకోవే శ్రీధరా ॥ 3 ॥

35 దరువు — మలిహరి రాగము

పల్లవి
మేలుకోవయ్యా దేవ నీలవర్ణా ॥
జగమేలు శ్రీధర మునులు మేలుకొల్పేరు ॥ ప ॥

చరణములు
1. అల్ల తెమ్మెర తల్లి, [1]అకరులు వెదజల్లె
అల్లన జక్కవ లతిశయిల్లె,
తెల్లనయ్యెను నిండు దీపకళికలెల్ల
తెల్లవారెను దిశలు తేజరిల్లె॥

2. [2]ఇవముచాయలవాఁడు సవరను చెలువాఱె
దివి రిక్కలోలిమై తెలివిమీఱె
కవిసి యిరు లెల్లకలయఁ [3]దొనలు దూరె,
త్రోవవెడలె తుమ్మెద దొమ్మిగేరె॥

3. తెలిమించువాంగళ్లు దిక్కులఁ బఱతెంచె
నిల మరుఁడు సింగాణి నెక్కుడించె
సొలయ వెన్నెల పులుగు సృతిశాలు ప్రాపించె
తొలిగట్టుపై ప్రొద్దు తోచిమించె॥

36 దరువు — దేవగాంధారి రాగము

పల్లవి
మేలుకోవయ్యా, దేవ, మేలుకోవయ్యా
నీలమేఘశ్యామ - నిత్యకల్యాణ॥

చరణములు
3. కినిసిదానవుండు, [4]తొలిమినుకులను దొంగిల
వనరాశిలో దాగె వంచనలను,
మనమునను నుతిశాలు, పెనుగొనఁగ వేదములు,
తనకిమ్మనుచు వచ్చి ధాతయున్నాఁడు॥

2. దనుజేంద్రుఁ డలుకతో కనలి యిటు నీ దైవ
మునుజూపుమని సుతుని చెనకు చున్నాఁడు,
మొనసి ప్రహ్లాదుండు, మురహార చక్రధర
వనజాక్ష కావుమని వనరుచున్నాఁడు॥

---

[1] పుప్పొడి. [2] హిమాంశువు; చంద్రుఁడు. [3] రత్నములయిన గుహలు. [4] వేదములు.

3. కరి మకరిచే తగిలి కరుణింపుమని నుతి
 ధ్యానింపు చున్నదియు,
 గరిమ శ్రీ సాహేంద్రుని
 వరకవితలను మాగధులు
 పరిపరివిధములఁ బాడుచున్నారు.

37 దరువు భైరవి - రాగము

పల్లవి మేలుకో శ్రీధర మేలుకో మురహర,
మేలుకోచక్రధర, మేలుకోవయ్యా॥
ఒకవంక కలువలు ముకిళితమాయెను.
అకళంక కువలయ మతిభీతిఁజెందె
ఒకకన్ను వికసించె నువిదెలతోఁగూడ సకల
జనములకును సంతోషమాయె॥
కలయ నైదువరాలు కలయ నైదువరాలు
చెలఁగి పొగడ నరులు శ్రీశాహవినుతా॥

వ॥ ఇత్తెఱంగున స్వామిమేలుకొన్న తదనంతరంబున శోభనమునుడివే క్రమము. 92

38 దరువు 1. శోభనమే శ్రీహరికి శోభనమే శ్రీసతికి
శోభనమే శౌరికిని, శోభనమే లక్ష్మికిని॥

2. నగవరోద్ధారునికి, నగసన్నిభకుచయుగకు
గగనవర్ణునికిని గగనమధ్యకును,

3. శంబరరూపునకు శంబర నయనకును,
అంబుజనాభునికి, నంబుజ గేహకును॥ శోభనమే॥

4. త్యాగేశమిత్రునికి, త్యాగేశసోదరికి,
భోగీశ శాయికిని, భోగీశవేణికిని॥ శోభనమే॥

మంగళము ద్విపద

శ్రీలోలుపేర నాశ్రితపాలుపేర నీలవర్ణునిపేర నిరుపముపేర
నారాయణునిపేర, నగధరుపేర వారిజోదరుపేర, వైకుంఠుపేర
పల్లకిసేవ ప్రబంధరత్నంబు పల్లవాయుధ సమప్రభగలవాఁడు
భూపాలమణి యేకభూధవయువతి దీపాంబగర్భాబ్ధి దివ్యరత్నంబు
సత్యభాషా హరిశ్చంద్రుఁ డుత్తముఁడు సత్యాగరాజాంఘ్రిసన్నుతిపరుఁడు
వాసుదేవచరిత్ర వర్ణనారతుఁడు భోసలకులశాహ భూపాలమౌళి
విరచించె సత్కవుల్ విస్మయమంద ధరణిలో నాచంద్రతారార్కముగను॥

విష్ణుపల్లకిసేవ ప్రబంధము సర్వము సంపూర్ణము.

★